మనవారు ఎన్నో యుగాలుగా పెంచి చెప్పిరని లోగడ వ్రాసితిమి. వీరందరి కాలమునందును విష్ణుప్రవక్తలుండి దేశ రక్షణమును, మతప్రచారమును గావించుచుండిరి. ఇక భారత యుద్ధకాల ప్రశంస గావింతము.

## భారత యుద్ధకాలము

పురాణములలోను, భారతమందును కనబడు ప్రకారము కలియుగారంభమునకు 37 సం॥లు ముందు భారతయుద్ధము జరిగినట్లు తెలును. ఆ యుగము క్రీస్తు పూర్వము 1920 సం॥ నాటిదని లోగడ రుజువు చేసితిమి. అందుచే దానికి పూర్వము 37 సం॥ర క్రిందట అనగా క్రీ.పూ. 1957 సం॥లో నది జరిగియుండును. యుధిష్ఠిరశకము ప్రమాది సం॥లో ఆరంభించినట్లు లోగడ నుడివిన శాసనమునుబట్టి కనబడుచున్నందున యుధిష్ఠిరుడు చనిపోయిన నాటికి యుగారంభము నుండి 18 సం॥లు మాత్రమే జరిగినట్లు అగుచున్నదిగాని 25 సం॥లని భారతాదులలో నున్న వ్రాతయే ప్రమాణముగా మనము భావించుట యుక్తము.

ఏలన, పైన నుడివిన శాసనము 11 వ శతాబ్దము దాదాపుగా పుట్టబడినది. దానిలోని సంఖ్య త్రోసివేసి చూచితిమేని యుధిష్ఠిరశకము శకలౌకికశకము క్రీస్తుపూర్వము 1895 సం॥లో నేర్పడినట్లు మనమిప్పుడు నిశ్చయింపవచ్చును. వరాహమిహిరాదుల లెక్కకిది వ్యత్యాసముగానున్నను పురాణములలోని పరీక్షిత్తు జననకాలము యుగారంభములను బట్టి నిర్ణయింపబడినదగుటచేత మిక్కిలి ప్రమాణమైనది. వరాహమిహిరుడు కల్యాదినొప్పుకొని దాని కనుగుణ్యముగ నాకాలము దాపుగా నీ శకము చెప్పుటయే పొరబాటు. ఇట్లే క్రీస్తుశకారంభమున తర్వాతను నుండినట్టియు, పూర్వ మన్వంతరాల సంఖ్యలే ప్రమాణములుగా గుడ్డిగా నమ్మినట్టియు, మన జ్యోతిష గణితశాస్త్రజ్ఞులు యీ భారతకాల యుగమునకును, తత్పూర్వము ఆరంభమైన క్రీ పూ. 3102 నాటి కలియుగారంభమునకును, నాటి సప్తర్షుల స్థానమునకును భేదము గుర్తింపజాలక, నీ రెండుయుగముల వర్ణనలను కలిపివైచిన పురాణవ్రాతలను విడదీయజాలక, కలియుగారంభము క్రీ. పూ. 3102 అనియు, యుధిష్ఠిరశకము 3077 అనియు తలంచి యీ ప్రకారమే



తమతమ గ్రంథములందు వ్రాయించియుండిరి. వరాహమిహిరుడు తన గ్రంథములలో నిట్టి సంఖ్య కనుగుణముగనే నాటికి ప్రచారమందున్న శాలివాహన, కలియుగ శకములలో వాకొనియున్నట్లు కనబడుచున్నది. ఈ వివరములకు ఆంధ్రమహాసామ్రాజ్యమను గ్రంథము చూడుడు. వరాహమిహిరాది గణితశాస్త్రజ్ఞుల కాలమునాటికే సూర్యసిద్ధాంత మమలునందుండుటయు సూర్యసిద్ధాంత జ్యోతిష గణితశాస్త్రములలోగూడ భారత యుద్ధకాలము పిమ్మట నేర్పరుపబడినట్టియు, సృష్టి పరిమితిని తెలుపుటకై యుద్దేశింపబడినట్టియు మన్వంతరాలు, యుగాలు, దేవమానములు లెక్కలోనికి తీసికొనబడి వానిప్రకారమే గ్రహగతులు, నక్షత్రగతులు మున్నగునవి నిర్ణయమొనర్పబడి యుండుటవల్లను, వరాహమిహిరాదు లీ రహస్యమును భేదింపక పోవుటకు కారణమనవచ్చును. వారికి చారిత్రక సత్యములతో గణితమును రుజువుచేయు నావశ్యకత లేకుండెను. అయినను వారుగూడ కల్యారంభము క్రీ.పూ. 3102 గానే చెప్పిరిగదా. ఆ దేవమానాది నిర్ణయములు, కాలములు వారి గణితములకుగాని, సూర్యసిద్ధాంత ప్రతిపాదనలకుగాని వ్యత్యాసములు కలిగించియుండవు. ఇక రాబోవు మనువుల విషయము విచారింతము. 8 మొదలు 14 వరకు గల మనువులుగూడ భారతయుద్ధమునకు పూర్వమే జనించి కొన్ని ప్రదేశములలో పాలించినవారుగా గన్పడుచున్నారు. మొదటి సావర్ణి సూర్యకుమారుడుగా వర్ణింపబడినాడు. ఒకచోట నతడు మనువులలో జివరివాడని చెప్పబడెను. వీరిక్రింద పాలనలో నున్న రాజుల విషయములు పురాణములు వచించుచున్నవి. వారికి [illegible] మున్నగువా రున్నారు. వీరందరిపేర్లతోను రాబోవు లక్షలకొలది సంవత్సరములుగా నుండు కాలమానమును మన పూర్వశాస్త్రజ్ఞులు కట్టివైచిరిగాని యవి యెంతవర కాచరణములో నుండగలవో ముందుకాలమే నిర్ణయించును. లింగ పురాణములో నొకచోట రాబోవు మనువుల నామములు సూర్యునిలోగల రంగులపేరిట పెట్టబడినట్లు వ్రాయబడినది. మన గ్రంథములందు గానబడుచున్నట్టియు, అపూర్వముగా నున్నట్టియు, భారతయుద్ధానంతరము నిర్మింపబడినట్టియు, నీ యుగ, మన్వంతర కాల నిర్ణయాదు లీ దేశమునందును లేవు. అట్లు లేవనిగూడను పురాణములందు గలదు. ఇది